# భృక్త రహిత తారక రాజ యోగము, దాని పరమార్ధము:

# కర్మయొక్క దుష్ఫలితములను తొలగించుట, శాశ్వతత్వమును నెలకొల్పుట

**Bhrukta Rahita Tāraka Rāja Yōgamu, Dāni Paramārdhamu:**

**Karmayokka Dushphalitamulanu Tolaginĉuṭa, Sāsvatatvamunu Nelakolpuṭa**




విస్సా అప్పారావు (జూనియర్)

Vissa Appa Rao (Junior)


ఆశ్వయుజ శుద్ధ విదియ. శ్రీ విళంబి నామ సంవత్సరము 1940 SE

**Sri Viḷambi Nāma Samvatsara Asviyuja Suddha Vidiya 1940 SE**

**10 అక్టోబర్ 2018 CE**

**10th October 2018 CE**




1

# భృక్త రహిత తారక రాజ యోగము, దాని పరమార్థము:

# కర్మయొక్క దుష్ఫలితములను తొలగించుట, శాశ్వతత్వమును నెలకొల్పుట

విషయ సూచిక:

# భృక్త రహిత తారక రాజ యోగము, దాని పరమార్థము:

# కర్మయొక్క దుష్ఫలితములను తొలగించుట, శాశ్వతత్వమును నెలకొల్పుట

రచన: విస్సా అప్పారావు (జూనియర్)

(ఆశ్వీయుజ శుద్ధ విదియ 10 అక్టోబర్ 2018)

## పరమాత్మ యొక్క సృష్టిలో విశ్వము, భూమి, మానవులు

"పరమాత్మకు నామ, రూపములు లేవు. పరమాత్మ విశ్వమంతా వ్యాపించివున్నాడు. ఆయన ప్రతీ కల్పములోనూ ఒక బ్రహ్మను సృష్టి రచనకై, ఒక విష్ణువును విశ్వ రక్షణకోసము, ఒక శివుని కల్పాంతమందు విశ్వమును ప్రళయములో లయము చేయడానికి, కూడా సృష్టిస్తాడు. బ్రహ్మకు సహాయము చేయడానికి సూర్య, చంద్ర, కుజ, బుధ, గురు,శుక్ర, శని, అనే ఏడు గ్రహములను కూడా సృష్టిస్తాడు. పరమాత్మ ఆదేశానుసారముగా సప్తగ్రహములు భూమిని, భూమి మీద వుండే మానవులను, ఇతర జీవులను నియంత్రిస్తున్నాయి. సూర్యుడు రక్త, మాంసాలను, చంద్రుడు చర్మమును, కుజ, గురులు ఎముకల ములుగ (బోన్ మారో), బుధుడు బుద్ధి, తెలివి తేటలను, శుక్రుడు తేజమును, శని ఎముకలను, నరములను తయారు చేస్తున్నాయి.

## భృక్త రహిత తారక రాజ యోగము, మాస్టర్ సి.వి.వి.

ఈ విధముగా విశ్వమునకు 14 కల్పములు, అనగా 27 మహా యుగములు, లేక 12,096 కోట్ల సంవత్సరములు గడచినాయి, ఈ దశలో పరమాత్మకు ఈ విశ్వాన్ని, మానవులను, ఇతరులను శాశ్వతముగా నుంచాలని కోరిక కలిగినది. ఈ కార్యము యోగము ద్వారా గాని సాధ్యము కాదని, దానికి భృక్త రహిత తారక రాజ యోగమును ప్రారంభము చేయించారు. భృక్త అనగా పూర్వపు జన్మల కర్మలు. రహిత అనగా వాటిని లేకుండాచేయడము. రాజ యోగము అనగా కుటుంబ జీవనము చేస్తూ యోగసాధన చేయడము. ఈ 'నూతన యోగము'నకు 'సైంటిఫిక్ యోగము' అని గూడ పేరు గలదు.

పరమాత్మ ఈ నూతన యోగ సాధనకు కుంభ కోణములోని శ్రీ కంచుపాటి వెంకాస్వామి రావు (మాస్టర్ సి.వి.వి.) గారిని ఎన్నుకొన్నారు. శ్రీ వారు 1868 ఆగస్టు, 4 తేదీన ఉదయము 10 గంటల 20 నిమిషములకు ధనిష్ఠ నక్షత్రమున, అమ్మాళ్ సత్రము, కుంభకోణములో జన్మించారు. పరమాత్మ యోగమునకు సంబంధించిన - నియమనిబంధనలు, సూచనలు, ఉపదేశాలు, తదితర విషయములు హిమాలయ పర్వతములలలో నివసించుతున్న మహాత్ములకు పంపగా, వారు వాటన్నిటిని ఎం.టి.ఏ. (MTA) ద్వారా శ్రీ కంచుపాటి వెంకాస్వామి రావు గారికి అందచేశారు. పరమాత్మ ఆదేశము ప్రకారము శ్రీ వెంకాస్వామి రావు గారు భూమిమీద మానవ దేహములో శాశ్వతత్వము (ఎటర్నిటీ) స్థాపన కై భృక్త రహిత తారక రాజ యోగము సాధన చేశారు. కొంత కాలముతరువాత శ్రీ వెంకస్వామి రావు గారిని మాస్టర్ సి.వి.వి. అని నియోగించుట జరిగినది. వారు వారు నూతన యోగమును 30.05.1910 తేదీన, సమయము 8.30. P.M. లకు ప్రారంభించారు.1910-1922 సంవత్సరములలో తమ యోగములో 752 మంది మీడియములకు (శిష్యులకు) ఇనీసియేషను (ఉపదేశము) నిచ్చారు. ఈ యోగములో ప్రాణాయామము, ఆసనముల అవసరంలేదు.

పూర్ణప్రయత్నము తరువాత శ్రీ మాస్టరు గారు మానవ సృష్టికి అణువు కారణము అని కనుగొన్నారు. అణువు ఒక జన్మనుండి తరువాతి జన్మకు కర్మ ఫలములను తీసుకుని వెళ్తున్నది. కర్మ ఫలములను మానవ శరీరమునుండి బయటకు విసిరివేసిన గాని మానవ శరీరము శాశ్వతముగా నుండజాలదు. జన్మసమయమున ప్రాణము అనే స్థిరత్వము మానవ శరీరములో వాయురూపమున ప్రవేశించును. భౌతిక శరీరమున ప్రాణమున్నంత కాలము జీవము వుండును.

ప్రాణము వెడలిన తరువాత జీవకళ ఉండదు మరణము సంభవించును. మానవ శరీరములో నాడీమండలముద్వారా ప్రాణవాయువు సంచరిస్తున్నది. నాడీమండలము నకు విడిపోవు స్వభావము గలదు. శరీరమును కాల్చితే అది ప్రాణమును కోల్పోయి నశించును.

భక్తి శ్రద్ధలతో యోగము యొక్క నియమనిబంధనలను తు.చ.పాటించుతూ పదిసంవత్సరములు ప్రార్థన చేసితే ప్రస్తుత జన్మలోని, పూర్వజన్మలలోని కర్మ ఫలములు ప్రకంపనల (vibrations) ద్వారా విసిరివేయబడును. వైబ్రేషనులు నాడీమండలము ద్వారా వస్తాయి. సావధానంగా సాధకునకు జ్ఞానము కలుగుతూ డెవలప్మెంట్ జరుగుతుంది. యోగ ధ్యాన సాధన సమయములో సుస్థిరంగా నుండే నాడీమండలము ఏర్పడును. నూతన నాడీమండలం ప్రస్తుతమున్న నాడీ వ్యవస్థలో లోపలి ట్యూబ్ గా శాశ్వతముగా స్థిరపడును. దాని ద్వారా ప్రసరించే ప్రాణ వాయువు మానవ శరీరమునుండి ఎన్నటికీ నిష్క్రమించదు. ఈపూర్ణ వ్యవస్థ ద్వారా ఏర్పడిన మానవ శరీరము రూపభేదము, క్షయములు లేకుండా శాశ్వతముగా నుండు స్థితిని పొందును.

సృష్టి కర్త విశ్వమును సువ్యస్థీకరించడానికి తాత్కాలిక సవరింపులు (temporary adjustments), అనేక కోర్సులు (courses), నిబంధనములు (regulations) విశ్వములోనికి మాస్టర్ గారి ద్వారా ప్రవేశబెట్టారు. నిబంధనలలో: భగవంతుని నిబంధనలు (God's regulations), గ్రహముల నిబంధనలు (planetary regulations), నక్షత్రముల నిబంధనలు (nakshatra regulations), తధాస్తు దేవతల నిబంధనలు (tadhastu devata regulations), స్త్రీ దేవతల నిబంధనలు (sthree devata regulations), ఋషుల నిబంధనలు(rishi regulations) – మొదలైనవి గలవు ... భవుతిక శరీరము శాశ్వతత్వము నకై సుమారు 900 పైగా నిబంధనలను 1910 లో హేలీస్ కామెట్టు ద్వారా విశ్వములో ప్రవేశబెట్టడము జరిగినది. ఆ రెగ్యు లేషనులు ప్రస్తుతము విశ్వములో పనిచేస్తున్నవి. ప్రస్తుత కాలంలోనూ, భవిష్యత్తులోనూ మన అంతరిక్షములోనూ, భవుతిక ప్రపంచములోనూ అనేక రకములైన ఉపద్రవములు, నైసర్గిక మార్పులు సంభవించనున్నవి. ఈ బృహత్కార్యములోను మాస్టర్ గారు మీడియంలను భాగస్వాములను చేశారు. యోగము పరిపూర్తి కాగానే మానవులకు ఆకలి,దప్పులు, నిద్ర వుండవు.

ప్రతీ మానవునిలోను కుండలిని అనే మాలిక్యూల్ (పరమాణు సముదాయము) గలదు.కుండలిని మూత్రావయవములు, పేగులు మధ్య వున్నది. అంతరిక్షములో ఒక కాస్మిక్ కుండలిని గలదు. దానిలో కోట్ల కొలదిమాలిక్యూలులు నిక్షిప్తమైనవి. యోగ సాధకుడు ప్రార్థన సమయములో కాస్మిక్ కుండలినిని తట్టినట్లైతే అది మానవకుండలినిని కదిపి అతని పూర్వజన్మల కర్మ ఫలములను తెలుపును. అతను మాస్టర్ గారి ద్వారా పరమాత్మను తన పూర్వకర్మల ఫలములను తొలగించమని వేడుకొనవలెను.

యోగ సాధకుడు ప్రతి రోజు రోజుకు మూడు సార్లు ప్రార్థన చేయాలి. ఉదయము 4 - 8 am, సాయము వేళలో 4 - 8 pm మధ్యను, రాత్రి పడుకునేముందు వొక రివ్యూ ప్రార్థనను చేయాలి. సూర్య గ్రహము ఉదయము 4 గంటలు నుండి సాయంత్రము 4 గంటల వరకు విశ్వము (కాస్మోస్)ను శాసించును. చంద్రుడు కాస్మోస్ ను సాయంత్రము 4 గంటలనుండి మరుసటి దినము ఉదయము 8 am వరకు శాసించును. ఒక దినము ప్రార్థన ఒక జన్మ యొక్క కర్మ ఫలములను తొలగిస్తుంది. విరామమము లేకుండా శ్రద్ధతో లోపము లేకుండా ప్రతి దినము ప్రార్థన చేయాలి. కనీసము 10 సంవత్సరముల ప్రార్థన అవశ్యముగా చేయాలి.

ప్రతీ మనిషికి ఒక పిట్యూటరీ గ్రంధి గలదు. పిట్యూటరీ గ్రంథిలో అసంఖ్యాక కణములు గుమికూడును.ప్రతీ కణము ఒక్కొక్క రోగమునకు ప్రాతినిధ్యము వహిస్తున్నది.1916లోనే మాస్టరు గారు భౌతిక శరీరములో 4448 రకముల రోగములను గుర్తించారు. కాస్మాసులో ఒక కాస్మిక్ పిట్యూటరీ గలదు. దానిలో కోట్ల కొలది మాలిక్యూల్స్ జమ అయినవి. ప్రతీ మాలిక్యూలుమీద అసంఖ్యాకములైన సూక్ష్మ అణువులు జమ అయి, ప్రతి కణము వివిధ రోగములకు సంబంధించినవిగా నున్నవి. ఒక రోగిని ట్రీట్ చేసే వ్యక్తి కాస్మిక్ పిట్యుటరీని ఆరోగమునకు సంబంధించి టచ్ చేస్తే, అది వెంటనే మాస్టర్ సి.వి.వి. కి

రిలీఫ్ కొరకు రిపోర్ట్ చేస్తుంది. వెంటనే రోగికి రిలీఫ్ కలుగుతున్నది.ట్రీట్ చేసే వ్యక్తి శ్రద్ధ,భక్తులతో, అకుంఠిత దీక్షతో, పూర్ణవిశ్వాసముతో లోలోన గమనించుతూ యోగా నియమనిబంధనలను 10 సంవత్సరములు నిరవధికముగా అనుసరించినచో, పైనగల ఉత్తమాధికారులు ట్రీట్మెంట్ శక్తులను సాధకునకు అనుగ్రహించగలరు. సాధకుడు శుద్ధ శాకాహారి, పొగ తాగని వాడు, మద్యము సేవించకుండా నుండేవాడు కావలెను.




మాస్టర్ సి.వి.వి., MTA, One Point చిత్రము

*చూడుడు: http://www.mastercvv.com/

గ్రహములు, ఋషులు, దేవతలు, నక్షత్రములు మొదలైనవి భూమిని, మానవదేహములను నియంత్రిస్తున్నాయి. అవి చాల శక్తివంతమైనవి. మాస్టర్ గారు మొదట వాటినన్నిటిని, ఆ తరువాత భూమిని, మానవ దేహాన్ని నియంత్రిస్తేగాని మానవ శరీరములో శాశ్వతత్వ స్థాపన సాధ్యముగాదని తలచారు. ఆవిధముగా చేసి, తరువాత వారు భూమికి ఒక హార్న్ కవర్ (horncover) తయారు చేసారు. ఆ కవర్ భూమిని కుప్పకూలకుండా కాపాడుతుంది. ప్రస్తుతము మానవ దేహములో జీవాణువులలో కొన్నిలోపములున్నవి అని వానిని సంస్కరించి, ప్రస్తుతము జీవరాశి వున్న భూమి, దానితో బాటుగా సౌర కుటుంబములోని గ్రహముల నిర్మాణములోని కొన్ని లోపములను గూడా, సంస్కరించిన గానీ ఇది సాధ్యము కాదని MTA, వన్ పాయింట్ ల ఆదేశము ప్రకారము కొన్ని కోర్సులను 1912-1922 సంవత్సరముల మధ్యను తన మీడియముల చేత చేయించారు. 1922 లో ఆ కార్యములన్ని పూర్తి అయినవని, ఇక ముందు కోర్సులు చేయవలసిన అవసరము లేదనీ, తన నామ స్మరణ “మాస్టర్ CVV నమస్కారం” అని ధ్యానము చేస్తే సర్వ కార్యములు సంపన్నము కాగలవని శిష్యులకు ఆదేశమిచ్చారు. శ్రీ వారు 1922 మే 12 న కుంభకోణము లో శరీరత్యాగము చేసి కనుమరుగయ్యారు.

## గురుదేవ్ VPS

మాస్టర్ గారి ఆదేశము ప్రకారము వారి శిష్యు లలో అగ్రగణ్యులు శ్రీ ప్రభాకర శాస్త్రి గారు (మీడియం సంఖ్య 330, యోగములో చేరిన తేదీ: 22 జూన్ 1916). గురుదేవులు శ్రీ ప్రభాకర శాస్త్రి గారు భక్తి శ్రద్ధలతో నిరంతరాయముగా 12 సంవత్సరములు (1916 -1928 సంవత్సరముల మధ్యను) యోగ సాధన చేశారు, ఆకాలంలో మద్రాసులో వున్న యోగ మీడియంలతో వారు సాధన చేశారు. 1928 నుండి వారు అనేకమంది యోగమిత్రుల అనారోగ్యములను మాస్టర్ గారి యోగ

ప్రార్థన ద్వారా నయము చేశారు. చెన్నై నుండి, ఆంధ్ర, తమిళనాడు ప్రాంతములనుండి చాలామంది వారి ట్రీట్మెంట్ ద్వారా స్వస్థత పొందారు. శ్రీ ప్రభాకర శాస్త్రి గారు 1912-1939 సంవత్సరముల కాలములో మద్రాస్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ (ప్రాచ్య లిఖిత భండాగారము) లో తెలుగు పండితులు గ పనిచేసి రిటైర్ అయినారు.

తరువాతి కాలములో (1939-1950 సంవత్సరముల మధ్యను) శ్రీ శాస్త్రిగారు తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ కళాశాలలో తెలుగు పండితులుగాను, తిరుమల తిరుపతి దేవస్థానము వారి అన్నమాచార్య వాఙ్మయ పునరుద్ధరణ కార్యములోను పనిచేసారు. ఆ కాలంలోనూ వారు మాస్టర్ గారి యోగ సాధనను కొనసాగించి ఆంధ్ర దేశములోని కొన్ని వందలమంది అనారోగ్యములను తొలగించి వారికి స్వస్థత చేకూర్చారు. శ్రీ శాస్త్రిగారు తిరుపతిలో 1950 ఆగస్టు 29 న తిరుపతిలో శరీరత్యాగము చేసి కనుమరుగయ్యారు. శరీరత్యాగము నకు ముందు శ్రీ శాస్త్రి గారు రచించిన వారి ఆత్మ కథ 'ప్రజ్ఞా ప్రభాకరము' ను 1951లో శ్రీప్రభాకర మిత్రమండలి (చెన్నై-తిరుపతి) వారు ప్రచురణ చేశారు.వారి ఆత్మ కథలో మాస్టర్ CVV గారి యోగము ద్వారా వారికి కలిగిన స్వానుభవములను విశదీకరించారు. ఆంధ్ర దేశములో విశేష ఆదరణ కారణముగా వారి పుస్తకము అనేకమారులు పునర్ముద్రణ గావింప బడినది. ఈ మధ్య కాలములో ప్రజ్ఞాప్రభాకరము - ఆంగ్లము, తమిళము, హిందీ, కన్నడ భాషానువాదములు గూడ ప్రచురింపబడినవి.

చూడుడు: ఇంటర్నెట్లో 'ప్రజ్ఞాప్రభాకరము' పుస్తకమును పిడిఎఫ్ ఫైల్ రూపములో డౌన్లోడ్ చేసుకుని చదువ వచ్చును.

https://archive.org/details/PragnaPrabakaramuSriVeturiPrabhakaraSastri1951212P9000000004275/page/n0

https://ia600404.us.archive.org/35/items/PragnaPrabakaramuSriVeturiPrabhakaraSastri1951212P9000000004275/Pragna%20Prabakaramu_Sri%20Veturi%20Prabhakara%20Sastri_1951_212%20P_9000000004275.pdf

## గురుదేవ్ AVS

ఓరియంటల్ కళాశాలలో శ్రీ ప్రభాకర శాస్త్రి గారి శిష్యులైన శ్రీ అర్చకము ఉదయగిరి శ్రీనివాసాచార్యులు (Sri A.V.Srinivasacharyulu) గారు యోగమును 1966-2006 మధ్యను సువ్యవస్థీకరించారు. మాస్టర్ CVV గారి ఆదేశానుసారముగా శ్రీనివాసాచార్యులు గారు అపారమైన మాస్టర్ గారి నోట్సునూ, డయరీలనూ, మహాత్మాస్ లెటర్స్ నూ, ప్రకాశంలోకి తీసుకుని వచ్చారు. మాస్టర్ గారి సాహిత్యాన్ని ఇంటర్నెట్లో అందరికి అందుబాటులో నుండేటట్లు చేశారు.

చూడుడు: http://www.mastercvv.com/

ఇంతేగాక మాస్టర్ CVV గారి ఆదేశానుసారముగా శ్రీనివాసాచార్యులు గారు కుంభకోణములోను తూర్పు డబీర్ వీధిలో శ్రీ మాస్టర్ గారు నివసించిన వారి గృహమును వేలంలో కొని, పునర్నిర్మించి, యోగ మిత్రులకు ప్రార్థన వసతులు, భోజన శాలను కలిగించించినారు.

## మాస్టరు గారి యోగ ప్రార్థన పద్ధతి

మాస్టరు గారి ప్రార్థనలో ఈ క్రింద విధముగా స్మరణ చేసుకోవాలని శ్రీ శ్రీనివాసాచార్యులు గారు తెలియచేసారు.

"సత్సంకల్పంతో ఈవిధముగా ప్రార్థించండి":

- ప్రార్థన -

"మాస్టర్ సి.వి.వి. నమస్కారము"

(మీ సంకల్పం ఇలా ఉండాలి)

“నేను, ఈ ప్రపంచమూ సుఖంగా ఉండాలి. పూర్వ జన్మ కర్మ, ఈ జన్మ కర్మ, తొలగిపోవాలి. నా ఈ జన్మకు ఒక అణువు కారణము. ఆ అణువు ఎన్నో జన్మల నుండి పాపాలు మోసుకొనివచ్చి, ఈ జన్మలో కష్టాలు, రోగాలు, కలిగిస్తుంది. ఆ అణువు లోని దోషాన్ని తొలగించి, నాకు వెంటనే స్వస్థత చేకూర్చాలి. రక్తమాంసాదులతో కూడిన ఈశరీరంతోనే నేను ఎటర్నిటీని మరుజన్మలో కాదు, ఈజన్మలోనే పొందేటట్లు అనుగ్రహించమని ప్రార్ధిస్తున్నాను. మాస్టర్ గారూ! మీరు సశరీరంగా వెలసి, ఎటర్నిటీని ఈ భూమిపై నెలకొల్పాలని ప్రార్ధిస్తున్నాను నమస్కారమ్”.

గమనిక: ఎవరైనా బలహీనంగా ఉన్నా, వ్యాధులతో బాధపడుతూ ఉన్నా, పడుకొని ఈ క్రింది విధంగా . ప్రార్ధించండి.

1. మీకున్న వ్యాదులన్నింటినీ మాస్టరు గారికి విన్నవించి వెంటనే నివారణ కావాలని ప్రార్ధించండి.
2. ఎవరైనా బలహీనంగా ఉంటే పడుకొని “మాస్టరుగారూ! నాకు ‘ప్లంటీ ఆఫ్ ప్రాణ సప్లై’ ఇంకా 'విగర్ సప్లై' ప్రసాదించండి” అని ప్రార్ధించండి.

**Prayer: English**
**“Master CVV Namaskaram”**
***You must give thought as follows*:**
**“Please make the entire Universe and myself Happy.**
**The past and present karmic effects be evaporated.**
**Atom is the cause for my birth.**
**Any defects in this Atom, it shall be rectified.**
**I must stand as Physically Eternal with flesh and**
**blood in this birth only but not in the next birth.**
**Namaskaram”.**
***If anyone is feeling weak or with any ailment,***
***then one must lay down and pray*:**
**"Master please supply Plenty of Prana and Vigour."**
**Immediately one must get relief.**





మాస్టర్ సి.వి.వి.  గురుదేవ్ VPS  గురుదేవ్ AVS

**భూమియొక్క పరిణామము (Evolution of Earth)**

ఆధునిక రేడియోమెట్రిక్ డేటింగ్ ప్రకారం భూమి యొక్క వయస్సు 4.54 బిలియస్ సంవత్సరములని నిర్ధారింప బడినది. భూమి మీద ప్రస్తుతమున్న భూభౌతిక స్వరూపము (Geophysical Shape) పూర్వము భిన్నముగ నుండేది. 4000 మిల్లియస్ -2500మిల్లియస్ (Ma) సంవత్సరముల పూర్వము కాలము ఆర్కియస్ ఈరా (Archaeon era) అని పిలువబడుతుంది. 2500-540 మిల్లియన్ల(Ma) పూర్వ కాలము ప్రొటెరోజోయిక్ (Proterozoic) ఈరా (era) అని పిలువబడుతుంది. భూగర్భ శాస్త్రజ్ఞులు పై రెండు కాలములను కలిపి ప్రీకేంబ్రియస్ (Precambrian) ఈరా అనిగూడ ప్రస్తావిస్తున్నారు. ఆ కాలమున భూమి పైన గల భూఖండముల స్వరూపము, విస్తృతి పూర్ణముగా తెలియకున్నది. కానీ ఆ

కాలమునకు చెందిన  ప్రాచీన శిలలు - ఆర్కియస్ జ్ఞయిసెస్ (archaean gneisses), గ్రానైట్ శిలలు - ప్రస్తుత ఇండియస్ పెనిన్సుల (Indian Peninsula), ఆస్ట్రేలియా, ఆఫ్రికా, దక్షిణ, ఉత్తర అమెరికా ఖండములలో గుర్తింపబడినవి.

భూగర్భ శాస్త్రజ్ఞులు 570 మిల్లియన్ల(Ma) పూర్వ కాలమున అప్పటి భూమిపైనగల ఏకైక ఖండము పేంజియా అని గుర్తించారు. తరువాత కాలములో భూమి అంతర్భాగమైన అప్పర్ మాంటిలు (Upper mantle) లోని ద్రవరూపము(మేగ్మా – magma) భూమి పయికి ఉబికి వ చ్చి, తరువాత కాలమున చల్లారి శిలారూపమును పొంది, వాతావరణ ప్రభావములు కారణముగా వర్షములలో ఆ శిలలు శిధిలమయి సముద్రములో సెడిమెంట్లయి, మళ్ళీ ఆ సముద్రగర్భములోని సెడిమెంట్లు, పయికి వచ్చి - ఈవిధముగా వివిధ కాలములలో పీరియాడిక్ సైకిల్సులలో పరివర్తనలు పొందినాయి. ఆ తరువాత 150 మిలియస్ సంవత్సరముల క్రితము రెండు మహా ఖండములు – లారెన్షియా (Laurentia), గోండ్వానా (Gondwana) - ఏర్పడినవని గుర్తించడము జరిగినది. ఉత్తర అమెరికా, గ్రీన్లాండు, యూరోప్, అసియా భూభాగములు కలసి లారెన్షియా మహాఖండము గాను, దక్షిణ అమెరికా, ఆఫ్రికా, భారత ఉప ఖండము, ఆస్ట్రేలియా, అంటార్కటికా, అన్ని కలసి గోండ్వానా మహాఖండము గాను, నుండేవని భూభౌతిక శాస్త్రవేత్తలు కనుగొన్నారు.

భూమి మీద ప్లేట్ టెక్టానిక్స్, ఊర్ధ్వ చలనములు (Plate Tectonics and Vertical Movements)

అచిర కాలములో మహాఖండముల మీద పగుళ్లు యేర్పడి, ప్లేట్లుగా నవి రూప భేదము పొందినవి. ఆ పగుళ్లు లోతు మహాసముద్రములలోని పర్వతశ్రేణులు డీపోషస్ రిడ్జెస్ (Deep Ocean Ridges) దగ్గర ఏర్పడినవి. భూఖండముల సరిహద్దులలో భూమిమీది పగుళ్లు ప్రస్ఫుటంగా రిఫ్ట్ వాలీస్ (Rift Valleys) గాను ప్రకటితమై నవి. డీప్ ఓషస్ రిడ్జెస్, రిఫ్ట్ వాలీస్, వాటితో బాటు అగ్నిపర్వతములు, భూకపంపములు ఏర్పడుతున్నవి.  ఆ తరువాత భూఖండముల మీద ప్లేట్లు విడిపోయి, మెల్లగా కదులుతూ ప్రస్తుతం వున్న స్థానముల దగ్గరకు వచ్చినవి. వానిలో భారత ఉపఖండం ఆసియా ఖండమును, చొచ్చుకుని ముందుకు కదలుతుండము చేత హిమాలయ పర్వతములు ఏర్పడినవి. హిమాలయ పర్వతములేర్పడిన ప్రదేశములో 150 మిలియస్ సంవత్సరముల క్రిందట టెథిస్ (Tethys) అనే మహా సముద్రముండేది. ఆ తెథిస్ మహాసముద్రము పూర్వము యూరోప్ ఖండము ముందు వరకు విస్తృతమయి ఉండేది. ప్లేట్ టెక్టానిక్స్ (PlateTectonics) కారణముగా పది మిలియస్ సంవత్సరములనుండీ నేటికీ గూడా  నిరంతరంగా భూమి మీద ఊర్ధ్వ చలనములు (వర్టికల్ మూవ్మెంట్స్ - Vertical Movements) జరుగుతున్నాయి.

గోండ్వానా మహా ఖండము, లారెన్షియా మహా ఖండమును న్యూ ఇంగ్లాండు - కనెడియస్ షీల్డ్ భూభాగమున ఢీకొనుట

అమెరికా సంయుక్త రాష్ట్రముల(USA), పూర్వోత్తర భూభాగము నకు న్యూ ఇంగ్లాండు అని పేరు గలదు. ఆప్రాంతము దాని ఉత్తరమున కెనడాలోని భూభాగములను కల్పి కెనడియస్ షీల్డు అని పేర్కొంటారు. ఈ భూభాగములో పేలియోజోయిక్(Palaeozoic) (500-250 మిలియస్) సంవత్సరముల కాలములో పీరియాడిక్ సైకిల్స్ ద్వారా అప్పలాచియాస్(Appalachian) పర్వత శ్రేణులు ఏర్పడినవి. అదేకాలమున లారెన్షియా, గోండ్వానా ఖండములు ఢీకొనిన చోట అప్పలాచియాస్ పర్వత శ్రేణులు ప్రస్తుత హిమయ పర్వత శ్రేణుల కన్నా ఎత్తులో వుండినవి. ఆ తరువాతి కాలమున ఇరోషస్ కారణముగా, అవి కరిగి ప్రస్తుతము వున్న ఎత్తు కు దిగినవి. ఈ కెనడియస్ షీల్డులోను ప్రస్తుత ఇండియస్ పెనిన్సుల (Indian Peninsula), ఆస్ట్రేలియా, ఆఫ్రికా, దక్షిణ, ఉత్తర అమెరికా ఖండములలో గుర్తింపబడిన ప్రాచీన శిలలు – ఆర్కియస్ (Archean) జ్ఞయిసెస్ (gneisses),గ్రానైట్ (granite) శిలలు - నేటికీ కనిపిస్తున్నవి.

భారత ఉపఖండము, ఇండియన్ ఓషన్ రిడ్జెస్ ప్రాంతములలో గత మిలియన్ సంవత్సరముల కాలములో నిరంతర మార్పులు

భారత ఉపఖండమున నర్మదా, గోదావరి,కృష్ణ, నదులు రిఫ్ట్ వాలీస్ గుండా ప్రవహిస్తున్నాయి. కొన్ని చోట్ల భూఖండముల భాగములు క్రిందికి దిగి సముద్రములోనికి, కొన్ని చోట్ల భూఖండముల భాగములు పైకి లేచి మార్పులు జరుగుతున్నాయి. అండమాన్, నికోబార్ దీవులు ఇండోనేషియన్ ఆర్చిపెలాగో, ఇండియన్ ఓషన్ రిడ్జిలతో కలుస్తున్నవి. వాటిమధ్యను అగ్నిపర్వతములు,భూకంపములు కలుగుతున్నవి. సుమత్రా, ఇండోనేషియా సముద్ర ప్రాంతమున 2004 సంవత్సరం, డిశంబర్ 26, తేదీన 9.1 మాగ్నిట్యూడ్ గల భూకంపమేర్పడి సముద్రములోను 100 అడుగుల ఎత్తు మహాతరంగములు త్సునామీగ ప్రయాణము చేసి హిందూమహా సముద్రము చుట్టును వున్న 14 దేశములలో 2,30,000 జనుల నష్టమైనది. అందులో దక్షిణ భారత, సింహళ, థాయిలాండ్ దేశములలో అత్యధిక నష్టము కలిగినది. ఆ విపత్తుకు కారణము ఇండియన్ ఓషన్ టెక్టోనిక్ ప్లేట్, బర్మా ప్లేట్ కిందినించి చొచ్చుకొనుట కారణముగా జరిగినది! ఆ తరువాత 18 September, 2018 న మధ్య సులవేసి, ఇండోనేషియా ప్రాంతమున 7.4 మాగ్నిట్యూడ్ గల భూకంపము సంభవించి, దాని తోబాటు త్సునామీ సముద్ర తరంగములు కారణముగా సుమారు 844 జనుల నష్టము కలిగినది.

అంతేగాక భారత ఉప ఖండము సముద్ర తీర ప్రాంతములలో గూడా అదే విధముగా భూభాగముల కదలికలు అయిదు వేల సంవత్సరములుగా జరిగినవని చారిత్రక ఆధారములు గలవు. పశ్చిమ తీరమున, శ్రీకృష్ణుని ద్వారకా పట్టణమున్న దీవి అరేబియన్ సముద్రములోనికి మునిగినది. సముద్రవిజ్ఞాన శాస్త్రజ్ఞులు ఆ పట్టణమును పరిశీలించి కెమెరాలతో చిత్రీకరించారు. అలాగే తూరుపు తీరమున నున్న విశాఖపట్టణము రామకృష్ణ బీచ్ దగ్గర బంగాళాఖాత సముద్రములోనికి 'విశాఖ స్వామి" దేవాలయము పురాతన కాలమున మునిగినది. మహాబలిపురం సముద్ర తీర ప్రాంతం దగ్గర గూడా పల్లవుల కాలపు ప్రాచీన దేవాలయములు కొన్ని సముద్రములోనికి దిగిపోయినవి!

పురాతత్వ శాస్త్రజ్ఞులు గుజరాత్ కచ్ ప్రాంతమున నర్మదా నది అరేబియా సముద్రములో కలసే చోట, క్రీస్తు పూర్వము మూడువేల సంవత్సరముల క్రితము హరప్పా సంస్కృతికి చెందిన ధోలావైరా అనే మహా నౌకా పట్టణమున్నట్లు కనుగొన్నారు. గత అయిదువేల సంవత్సరములలో ఆ ప్రదేశమున భూమి సముద్రమట్టమునకు చాల పైకి లేచినట్లుగా తెలుస్తున్నది! హిమాలయములనుంచి గంగ, యమునా, నదులు ప్రారంభ మయి ప్రవహి స్తూ, తూర్పున బంగాళా ఖాతములోను కలువగా, సరస్వతి నది గుడా కొన్ని వేల సంవత్సరముల పూర్వము హిమాలయముల నుంచి ప్రారంభమయి పశ్చిమమున అరేబియా సముద్రముద్రములోను కలిసేది. ఆ తరువాత కాలమున సరస్వతి నది సింధు, రాజస్థాన్ ప్రాంతములలో భూమి పైకి లేవడము కారణముగా, ప్రవాహమునకు అడ్డము కలిగి, ఇసుక మేటతో ఎడారిగ మారి అంతర్ధానమైనది.

అదేవిధముగా పురాతన కాలమున కావేరి నది చెన్నై ప్రక్కగా ప్రవహించి పులికాట్ సరస్సులో కలిసేది. పులికాటును ప్రాచీన 'సంగము' సంస్కృతీ కాలమున (2300- 2000 సంవత్సరముల పూర్వము) "ప్రళయ కావేరి" అని పిలిచేవారు! ఆ తరువాత కాలమున భూమి పైకి లేవడము కారణముగా కావేరి నది తన గమనమును మార్చుకొని -మెట్టూరు, భవాని-సేలం, తిరుచ్చి - ప్రాంతముల మీదుగా కావేరిపట్టణమున సముద్రములో కలిసినది. కృష్ణ, కావేరి నదులలో రెండు వేల సంవత్సరముల పూర్వము ప్రస్తుత తీర ప్రాంతముల నుండి చాలా లోపలి దాకా, గ్రీకు, రోమన్ దేశ నౌకలు వెళ్లి మన దేశముతో వ్యాపారము చేసినట్లు చారిత్రక ఆధారములను పురాతత్వ శాస్త్రజ్ఞులు నిరూపించారు. గత 1500 సంవత్సరములుగా ఆ తీర ప్రాంతముల భూమి పైకి లేవడము కారణముగా ఆ నదులు నౌకాయానమునకు వీలు లేకుండా మారినవి.(+ చూడుడు: పాదసూచి-)

ఈ మధ్య కాలములో గూడ అరేబియా సముద్ర తీరప్రాంతములో పాకిస్తాన్, పడ్డి జీర్, గ్వాడర్, అనే చోట 2013 సెప్టెంబర్ 24 తేదీన భూకంపానంతరం బురద, రాళ్లతో నిండిన (Mud-volcano) ఒక కొత్త ద్వీపము భూమి పైకి వచ్చి

ఏర్పడడము జరిగినది! ఈ ప్రాంతమున అరేబియన్ సముద్రప్రాంత ప్లేట్, యూరోప్ ఖండము ప్లేట్ క్రిందకు చొచ్చుకొని పోవడము కారణముగా నిరంతరంగా ప్లేట్ టెక్టోనిక్ కదలికలు, ఊర్ధ్వ చలనములు, భూకంపములు, సంభవిస్తున్నవి. ఉదాహరణకు - పాకిస్తాన్ లోని నైరుతి సముద్ర తీరమున 7.2 మాగ్నిట్యూడ్ గల భూకంపము 2011జనవరి 18న సంభవించినది.

తెనుగు కవిత్వములో భూభౌతిక రహస్యములు వెల్లడి

పదిహేనవ శతాబ్దానికి చెందిన మహాకవి శ్రీనాథుడు "పల్నాటి వీర చరిత్ర" అనే ద్విపద రచనలో, బ్రహ్మ యొక్క సృష్టిలో భూమిమీద కాలానుగుణముగా జరిగే భౌతిక పరిణామములు, చరాచర జీవములలోను జరిగే మార్పులు గూర్చి వివరించాడు! # ( చూడుడు: పాదసూచి)-

"బాలచంద్రుడు తల్లితో భౌతిక రహస్యములు తెలుపుట":

"చెడని పదార్థముల్ సీమలో లేవు
చెడును గట్లును నదుల్ చెట్లును లతలు
సంచారి జీవముల్ సమయుచునుండు
సమసినజీవముల్ జనియించుమరల
జడపదార్థంబులు చైతన్యమొందు
*పొలియదొక్కటివిను బొత్తిగానెపుడు
పుట్టదు క్రొత్తది భూమిలోపలను
పోయినదానిని పోయెనటంచు
ఉన్నదానిని చూచి యున్నదటంచు
భావింపగారాదు పడతిరోకనుము
కాలవశంబున గలపదార్థములు
రూపభేదంబుల రూఢిగాబొందు
ధర బ్రహ్మవ్రాతలు తప్పింపరాదు."

*(నిత్యం పరమాణురూపం అని తార్కికుల మతము కూడ)

బాల చంద్రుడు తల్లి ఐతమ్మకు వైరాగ్య ఉపదేశమున కర్మరహస్యముగా జనన-మరణ నిత్యత్వ చక్రము గురించి తెలుపుట:

ఇటువంటి మానవుడీ దేహమెడలి
పోయి కొన్నాళ్ళకు బుట్టును మరలి
కర్మరహస్యముల్ గాంచినవారు

భూమి యొక్క జియోమాగ్నెటిక్ ధ్రువములు

భూమియొక్క జియోగ్రాఫికల్ (poles)ధృవములకు భిన్నముగా జియోమాగ్నెటిక్ (poles) ధృవములు నున్నవి. అవి స్థిరముగా ఒక చోట నుండక జియోగ్రాఫికల్ ధృవముల చుట్టూ బొంగరం వలే తిరుగుతూ వున్నాయి. అంతేగాక ప్రస్తుతము ఉత్తర-దక్షిణముగా నున్న మాగ్నెటిక్ పోల్స్ పూర్వ కాలంలో దక్షిణ-ఉత్తర ధ్రువములుగా నుండేవి. ఆవిధముగా మాగ్నెటిక్ పోల్స్ పొలారిటీ చాలా మిలియన్ల సంవత్సరములుగా, నిరంతరంగా మారుతూవున్నట్లు శాస్త్రజ్ఞులు భూమిమీద

ప్రాచీన కాలపు రాతిపొరలను పరిశీలించి తెలుసుకున్నారు. భూమి యొక్క జియోమాగ్నెటిక్ డిప్ ఈక్వేటర్ 1910-20 దశాబ్దములో కుంభకోణము, పాండిచ్చేరి, చెన్నైలమీదుగా వెళుతూవుండినది. ఆ కారణము చేతనే కుంభకోణములో శ్రీ మాస్టర్ సి.వి.వి. గారు తమ యోగమును ప్రారంభించారు! పుదుచ్చేరి లో శ్రీ అరబిందో గారు వారి యోగ సాధన చేశారు! హిమాలయ పర్వతములు భూమి మీది సర్వోన్నపర్వతములు. వాని పైన ప్రాణ వాయువు గాలి పలుచగా నుండి, అంతరిక్షమునుండి వచ్చు కాస్మిక్ కిరణముల తీవ్రత చాలా ఎక్కువగా నుండడము కారణముగా శ్రీ మాస్టర్ గారు, ఇంకా అనేక మహా యోగులు అక్కడ తమ సూక్ష్మ (ఈథర్) శరీరములతో తపస్సు చేస్తున్నారు.

జీవ పరిణామము (Biological Evolution), మానవ పరిణామము (Human Evolution)

భూమి మీద గల జీవ రాసులన్నీ ఏక కణమునుంచి వివిధ పరిణామములతో ప్రస్తుతమున్న రూపములకు మార్పు చెంది స్థిరమైనవి అని చార్లెస్ డార్విన్ అనే శాస్త్రజ్ఞుడు (1809-1882) నిరూపించాడు. ఆ క్రమములో మానవుడు ఉత్కృష్టమైన జీవి. అతని పరిణామక్రమము అంతా మాతృగర్భములో నవ మాసములలో అండ దశ నుండి మానవ దశ వరకు పూర్తిగా పొంది జన్మ తీసుకుంటున్నాడు - భూమిమీద జీవ పరిణామ చరిత్ర నంతటిని మానవుడు మాతృ గర్భములో జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాడు! “Ontology recapitulates phylogeny” (ఎర్నస్ట్ హెకెల్: 1834-1919). మానవ గర్భములో పిండ పరిణామము గురించి ఇంగ్లండు దేశమున హ్యూమన్ ఎంబ్రియోలజీ డిపార్ట్మెంట్, కేంబ్రిడ్జి యూనివర్సిటీలో 1958-59 సంవత్సరముల మధ్యను ప్రొఫెసర్ విస్సా రామచంద్ర రావు గారు పరిశోధన చేసారు. మన భాగవతములో పరమాత్మ యొక్క దశావతారములు జీవ పరిణామ క్రమమునకు సామ్యముగా నున్నవి!

అయినప్పటికీ మానవుని జీవ కణములోను, నాడీమండలంలోనూ ఇంకా మార్పు వస్తే గాని మానవ శరీరములో శాశ్వతత్వము సాధ్యము కాదని ఆ లక్ష్యసాధనకై మాస్టర్ సి.వి.వి. గారు తమ యోగములో సాధన చేసారు. శ్రీ మాస్టర్ గారు ప్రస్తుత మానవ శరీరములలో శాశ్వతత్వ స్థాపనకై పరమాత్మ యొక్క సంకల్పమును బీజము రూపమున 1910లో హేలీస్ కామెట్టులో ప్రవేశబెట్టారు. ఆసంకల్పము కారణముగా మానవునిలో సూపర్ (అతి) సూక్ష్మ శరీరము మానవునిలో ఏర్పడును. అది గ్రహముల, నక్షత్రముల శక్తుల నధిగమించినదిగ నుండును. జీవకణములలో మార్పు గురించి శ్రీ అరబిందో గారితో నున్న శ్రీమతి మీరా(మదర్) గారు గూడా అటువంటి సాధన చేసినట్లు పాండిచ్చేరి ఆశ్రమము వారి ప్రచురణల ద్వారా తెలుస్తున్నది. గత నాలుగు దశాబ్దములలో డిఎన్ఏ, హ్యూమన్ జెనోమ్ లలో జీవ పరిణామము గురించి ఇంకా విస్తృతముగా పరిశోధనలు జరుగుతున్నవి.

పరమాత్మ, జీవాత్మల శాశ్వతత్వము (Eternity of Paramatma and Jeevatma)

"సర్వం ఖల్విదం బ్రహ్మ ", "అయమాత్మా బ్రహ్మ ", అని 1300 సంవత్సరాల క్రితము ఆది శంకరాచార్యులవారు, "జీవులందరికి ఒకడే అంతరాత్మ' అని 700 సంవత్సరాల క్రితము శ్రీ అన్నమాచార్యులు తెలిపారు! భూమి మీది జీవాత్మలు అన్నీ పరమాత్మ ప్రతి రూపాలు. అన్నమాచార్యుల వారు పరమాత్మ శ్రీ హారిని, అనగా శ్రీ వేంకటేశ్వరస్వామిని "అన్ని మంత్రములు ఇందే ఆవహించెను, వెన్నతోటి కలిగే నాకు వెంకటేశు మంత్రము", "ఎన్నటికీ చెడని మందు, అన్ని రోగములకూ మందు" అని, ప్రస్తుతించారు. అన్నమాచార్యుని కీర్తనలకు, మన మాస్టర్ సి.వి.వి. గారి ప్రేయరుకు చాలా భావ సామ్యమున్నదని నేను ఒకసారి చెప్పితే శ్రీ AVS గారు"అవునయ్యా, చాలా నర్మగర్భితమైన సామ్యమున్నది" అన్నారు! ఒక సారి గురుదేవులు VPS గారి శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు 1964-65 సంవత్సరములో నాతొ ఈవిధముగా చెప్పారు -"మాస్టారు గారి యోగము పరిపూర్ణమై తప్పక భూమిమీద మానవులకు శాశ్వతత్వము లభిస్తుంది. అప్పుడు మన దేవాలయముల లోని దేవతలందరు గూడా తమకూ అదే విధముగా మానవజన్మ శాశ్వతత్వముతో కావాలని వీధులలో పరుగెత్తుతారు!"

నా అమ్మగారు శ్రీమతి లలిత 1993 సంవత్సరమున సెప్టెంబర్ నెలలో మూడు రోజులు అస్వస్థులై, 16 వ తేదీ రాత్రి 11:30 గంటలకు సేలం హాస్పిటల్ లో శరీరము విడచి కనుమరుగైనారు. ఆ తరువాత మా నాయనగారు ఢిల్లీ లోని నాకు ఫోను చేస్తే, ఆ సమయమున ఢిల్లీలో పెద్దవర్షము పడి ఫోనులు పలుకలేదు. అంతేకాక ఆ సమయమున నాకు విపరీతమైన తలనొప్పి మైగ్రేన్ కలిగి రాత్రి బాధలో నుండగా నాకు మా అమ్మగారు కనిపించారు. వారు నా నాయన గారితో "మీ తండ్రి గారు

పైవూరినుండి వచ్చారు, వారి సదుపాయములు గమనించండి" అంటున్నట్లు నాకు తెలిసినది! అప్పటికే నా తాత గారు అప్పారావు గారు శరీరం విడచి 17 సంవత్సరములైనవి! ఆ తరువాత ఉదయము 9:30 గంటలకు నాకు నా తండ్రి గారి టెలిగ్రామ్ అందినది! నా అమ్మగారు కనుమరుగైన తరువాత ఒక సారి నేను శ్రీ శ్రీనివాసాచార్యులు గారితో నా అమ్మగారు తిరిగి జన్మ తీసుకుంటారా అని ప్రశ్నించగా ఈవిధముగా తెలిపారు "శాశ్వతత్వము గురించి సాధన చేసిన శ్రీ మాస్టర్ సి.వి.వి. గారు, మదర్ వెంకమ్మ గారు, గురుదేవులు ప్రభాకర శాస్త్రి గారు, శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు, హిమాలయములలో తమ సూక్ష్మ శరీరములతో నున్నారు. వారితోబాటు ఇంకా అనేక మహా యోగులు అక్కడ తమ సూక్ష్మ (ఈధర్) శరీరములతో తపస్సు చేస్తున్నారు. వారితోబాటు మాస్టర్ యోగ సాధకులైన శ్రీ విస్సా అప్పారావు గారు, శ్రీమతి లలిత గారు, ఇంకా ఇతర శిష్యులూ, వున్నారు. వారందరికి తిరిగి జన్మ తీసుకోవలసిన అవసరము లేదు. భూమిమీద శాశ్వతత్వము భవిష్యత్తులో జరిగినప్పుడు వారందరు శ్రీ మాస్టర్ గారితో తమ శరీరములతో తిరిగి రాగలరు" అంతేగాక శ్రీ సుందర శివరావు గారితో ఒక సారి వారు శ్రీ మాస్టర్ గారు శాశ్వతత్వము నెలకొనినప్పుడు ముంబై దగ్గర అరేబియా సముద్రములో ఒక దీవి పైకి వచ్చి దానిమీద ప్రత్యక్షమవుతారని, పాకిస్తానులోని చాలా భూభాగము క్రిందకు దిగి సముద్రములో కలిసిపోతుంది అని తెలియచేసారు!

ఇంకా వివరములకు చూడుడు: (References): >>>

## References:


1. * http://www.mastercvv.com/
2. https://en.wikipedia.org/wiki/Geological_history_of_Earth
3. https://en.wikipedia.org/wiki/Geology_of_New_England
4. https://en.wikipedia.org/wiki/Gondwana
5. **+ Vertical Movements of the Eastern Coast of Peninsular India in the Pleistocene and Recent Times:** ***Article by*** **Vissa Appa Rao (Junior)** ***in*** Tectonophysics (*International Journal*) ***by Elsevier Publications***) **18(3-4):367-378 · July 1973**
6. https://en.wikipedia.org/wiki/Plate_tectonics#Definition_and_refining_of_the_theory
7. **Gaur, A.S.; Sundaresh and Sila Tripati (2004). "An Ancient Harbour at Dwarka: Study based on the Recent Underwater Explorations". Current Science. 86 (9). :** [http://www.currentscience.ac.in/Downloads/article_id_086_09_1256_1260_0.pdf]
8. A.S. Khadikar, N. Basaviah, T. K. Gundurao and C. Rajshekhar: *Paleoenvironments around the Harappan port of Lothal, Gujarat, western India, in Journal of the Indian Geophysical Union* **(2004):** http://www.igu.in/8-1/5khadkikar.pdf
9. **Mahabalipuram Temple Remains underwater:** https://www.newscientist.com/article/mg18524883-800-tsunami-waves-exposed-remnants-of-lost-city/#.VJ6wGF4Bds
10. **Dholavira: A Harappan City** ***on the*** **Khadir island off the Rann of Kutch:** http://whc.unesco.org/en/tentativelists/5892/http://whc.unesco.org/en/tentativelists/5892/
11. **Earthquake Births New Island off Pakistan: 24-28 September 2013.** http://earthobservatory.nasa.gov/IOTD/view.php?id=82146
12. **Mud Volcano Emerges from the Arabian Sea: January 21, 2011.** http://earthobservatory.nasa.gov/IOTD/view.php?id=48801&eocn=image&eoci=related_image
13. P**Srungara Srinadhamu – (Srinadha Charitra)** ***by Sri Veturi Prabhakara Sastri*** -http://ebooks.tirumala.org/Product/?ID=1643 Pages 260 and 203-233.
14. **# (a).** https://archive.org/stream/palnativeerachar022033mbp#page/n267/mode/2up
    **p 268** ***under*** **"Balachandra Revealing Physical Mysteries to his Mother Aitamma" –stanzas 148-160**
    "బాలచంద్రుడు తల్లితో భౌతిక రహస్యములు తెలుపుట": పద్యములు **148-160.**
15. **# (b).** https://archive.org/stream/palnativeerachar022033mbp#page/n265/mode/2up
    **p 267** ***under*** **– Stanzas 60-62 (Balachandra Counselling Vairagya to his Mother Aitamma)**
    "బాలచంద్రుడు ఐతమ్మకు వైరాగ్యముపదేశించుట" - పద్యములు **60-62.**
16. Pole Reversal Happens All The (Geologic) Time | NASA https://www.nasa.gov/topics/earth/features/2012-poleReversal.html
17. https://en.wikipedia.org/wiki/Brahman
18. @Annamayya Lyrics WIKI
19. **Yogamu Anubhavālu, May 2018: by Timmaraju Sundara Siva Rao (*On Yoga Experiences in Telugu*)**
20. Article 4.14 **"I and our Elder Brother Sri Prabhakara Sastri"** *by* ***Dr.*****Veturi Chandrasekhara Sastri (p.160) from Yoga Life of Vissas Practicing Bhrukta Rahita Taraka Raja Yoga, 2018.** https://ia601504.us.archive.org/15/items/YogaLifeOfVissasPracticingBhruktaRahitaTarakaRajaYoga/Yoga%20Life%20of%20Vissas%20Practicing%20Bhrukta%20Rahita%20Taraka%20Raja%20Yoga.pdf

**అనుబంధము: "భృక్త రహిత తారక రాజ యోగము, దాని పరమార్థము"నకు**

## సృష్టి కర్త బ్రహ్మల యొక్క వయస్సు

భారతీయ వేదాంత గ్రంధము భాగవత పురాణము ఆధారముగా సృష్టి కర్త బ్రహ్మ యొక్క ఒక దినమునకు 4.32 బిలియన్ సంవత్సరములు (భూమియొక్క కాలమానము ప్రకారము)సమానము. అనగా 432 కోట్ల సంవత్సరములకు సమానము! బ్రహ్మ యొక్క ఒక కాస్మిక్# దినమును 14 కాలభాగములు (పీరియడ్లు)గ విభజింప బడినవి. అటువంటి 6పీరియడ్లు పూర్తి అయి మన భూమి ప్రస్తుతము 7వ భాగములోనున్నది.

- ప్రతీ కాల పీరియడుకు ఒక మనువు అనే పరిపాలకుడు నియమించబడినాడు. ఆ మనుపరిపాలన కాలమునకు మన్వంతరము అనే పేరు గలదు.
- ప్రస్తుత మన్వంతరమును వైవస్వత మనువు పరిపాలిస్తున్నాడు.
  అతను సూర్యుని కుమారుడు.
- #ఒక కాస్మిక్ దినము (పగలు, రాత్రి కలపి)ను రెండు కల్పములుగా గూడ ప్రస్తావించారు.
- నేటి వరకు గడచిన మన్వంతరముల పేర్లు : -
  1. స్వాయంభువ మన్వంతరము - సృష్టి యొక్క ఆది(ప్రారంభము)
     ధ్రువుని ఉపాఖ్యానం (అంతర్గాథ)
     భగవంతుని నృసింహావతారము, ప్రహ్లాదుని సంరక్షించుట
  2. స్వారోచిష మన్వంతరము - సురత చక్రవర్తి ఉపాఖ్యానం
  3. ఉత్తమ మన్వంతరము
  4. తామస మన్వంతరము - గజేంద్రమోక్ష ఉపాఖ్యానం
  5. రైవత మన్వంతరము –
  6. చాక్షుష మన్వంతరము - క్షీరసాగరమధనం ఉపాఖ్యానం
  7. ప్రస్తుత మన్వంతరము: వైవస్వత మన్వంతరము నడచు చున్నది.

- ఇంకను 7 మన్వంతరము లు గడువవలసినది.
- ప్రతీ మన్వంతరము 71మహాయుగముల క్రింద విభజింప బడినవి. మన భూమి ప్రస్తుతము వైవస్వత మన్వంతరములో 28వ మహాయుగము లో నున్నది.
- ఒక కల్పంలో రెండు మహా యుగములుండును. ఒక కల్పమునకు 4.32 బిలియన్ లేక 432 కోట్ల సంవత్సరములు సమానము.
- ప్రస్తుతము 14 కల్పములు అనగా 28 మహా యుగములు గడచినవి. అనగా 12,096 కోట్ల సంవత్సరములు గడచినవి.
- ప్రస్తుత మన్వంతరములో, శ్వేత వరాహ కల్పంలో ప్రధమ భాగమున భగవంతుని వామనావతారం, కృష్ణావతారం గడచినవి.
- ప్రతీ మహా యుగములో 4 యుగములు ఉండును. అవి:
  - కృత యుగము 1,728,000 సంవత్సరములు
  - త్రేతా యుగము 1,296,000 సంవత్సరములు
  - ద్వాపర యుగము 894.000 సంవత్సరములు
  - కలి యుగము 432,000 సంవత్సరములు

- మొత్తము మహాయుగమున 432 కోట్ల సంవత్సరములు

➢ మనము ప్రస్తుతము వైవస్వత మన్వంతరములో శ్వేత వరాహ కల్పంలో ప్రధమ భాగమున, కలి యుగము ప్రధమ భాగమున వున్నాము!

**ఇంకా వివరములకు చూడుడు:**

1. http://www.encyclopediaofauthentichinduism.org/articles/48_the_exact_calculations.htm
   **The exact calculations of the age of Brahma and the existing *manvantara* according to the Bhagawatam.**
2. https://www.speakingtree.in/blog/age-of-universe-and-brahma-as-calculated-in-vedas
3. https://www.speakingtree.in/blog/manvantaras-mystery-we-are-presently-in-the-kaliyuga-of-the-28thmahayuga-of-the-7th-manvantara
4. https://en.wikipedia.org/wiki/Kalpa_%28aeon%29

## ఆధునిక ఖగోళ భౌతిక శాస్త్రము (Modern Astrophysics) ఆధారముగా మన సౌరకుటుంబము, భూమి యొక్క వయస్సు

ఇమాన్యువల్ స్వీడన్బోర్గ్ (29 జనవరి,1688 – 29 మార్చ్,1772), ఇమాన్యువల్ కాంట్ (22 April 1724 –12 February 1804), పియర్రే-సైమన్ లాప్లాసు (23 March 1749 – 5 March 1827) అనే ముగ్గురు శాస్త్రజ్ఞుల పరిశోధనల ఆధారముగా "నెబ్యులార్ మోడల్ హైపోథీసిస్" ఏర్పడినది. ఆ సిద్ధాంతము ప్రకారము మన సౌర కుటుంబము విశ్వములో ఒక పాల పుంత నుండి ఏర్పడినది. మొదట పాల పుంతలోని ఒక చిన్న భాగము గురుత్వాకర్షణ శక్తి విచ్ఛిన్నము (గ్రావిటేషనల్ కొలాప్స్ - gravitational collapse) కాగా సౌర కుటుంబముగా ఏర్పడినది.

సౌర కుటుంబము ప్రారంభము, దాని పరిణామము 4.6 బిలియన్ సంవత్సరముల క్రిందట ప్రారంభమైనది. గ్రావిటేషనల్ విచ్ఛిన్నతి లోని ముఖ్యమైన భాగము కేంద్రములో సూర్య గ్రహము క్రింద నిలచింది. మిగతా భాగము ప్రోటో ప్లానెటరీ డిస్కు (proto-planetary disc mass) గడ్డ గా మిగిలినది. ఆ డిస్కు గడ్డ నుండి భూమి, తదితర గ్రహములు, చంద్ర ఉపగ్రహము, మిగతా ఉపగ్రహములు, ఉల్కలు(ఆస్టెరాయిడ్స్) వగైరాలు ఏర్పడినవి. తరువాత భూమి పూర్ణ గ్రహముగా ఏర్పడుటకు $\pm$ 20 మిలియన్ సంవత్సరములు పట్టి వుండవచ్చును.

**ఇంకా వివరములకు చూడుడు:**

- https://en.wikipedia.org/wiki/Formation_and_evolution_of_the_Solar_System
- https://en.wikipedia.org/wiki/Age_of_the_Earth
- https://en.wikipedia.org/wiki/Nebular_hypothesis

**E-mail: arvissa@gmail.com**